| వరుస సంఖ్య | రోడ్డు పేరు | పొడవు, మైళ్ళలో మై—ఫ—అ |
|---|---|---|
| 1. | రాజంపేట–కదిరిరోడ్డు ఎం. డి. ఆర్. 36–0–0 నుండి 58—2—144 వరకు .. | 22—3—144 |
| 2. | రాయచోటి–వేంపల్లి రోడ్డు ఎం. డి. ఆర్. 0—0—0 నుండి 32—6—217 వరకు .... | 32—6—217 |
| 3. | వేముపుల బ్రాంచ్ రోడ్డు ఒ. డి. ఆర్. 0—0—0 నుండి 1—6—199 వరకు .... | 1—6—199 |

## రోడ్ల ప్రక్కనచెట్లు.

రోడ్ల కిరువైపులా చెట్లను నాటటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.04 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

ఈ పథకం క్రింద 1959–60 ప్రణాళికలో రు. 15.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించ బడి ముగింప బడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను పూర్తి చేసే నిమిత్తం ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంట్లు యివ్వటం కోసం పై డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.12 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఇతర రోడ్లు (క్రొత్త పనులు.)

పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను చేకొనే నిమిత్తం యీ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు సగం గ్రాంట్లు యివ్వబడతాయి. జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల ప్రయోజనం పొందేవారు మిగతసగం ఖర్చును భరించాలి. క్రొత్త పనుల నిర్వహణ నిమిత్తం ఆంధ్రలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు ఇవ్వటం కోసం 1959–60 లో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు.

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలు, గ్రామాలకు క్రొత్త రోడ్లు, గ్రామాలకు గ్రామాలకు మధ్య రోడ్లు నిర్మించటం జరుగుతుంది. జిల్లా కలెక్టర్లు యీ పథకం క్రింద చేయవలసిన పనులను నిర్ణయించి నిర్వహిస్తారు. ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తారు. మిగత సగం ఖర్చుయీ రోడ్లవల్ల ప్రయోజనం పొందే ప్రజలు భరించాలి. ఆంధ్రలో యీ పథకం క్రింద 1959—60 లో రు. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టటానికి ప్రతిపాదించబడింది. ఇందులో రు. 1.068 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

# విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్యాభివృద్ధికోసం రు. 6.152 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుససంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగింపు పథకాలు** | |
| 1. | 1957—58 లో అమలుపరచబడిన ప్రీ-ప్రయిమరీ బేసిక్ స్కూల్స్ పథకం (ఒక సెక్షను) | 0.020 |
| 2. | 1958—59 లో లో ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలకు అనుబంధించబడిన ప్రీ-బేసిక్ విభాగాలకు (ఒక సెక్షన్) | 0.020 |
| 3. | 1956—57లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | |
| | (ఎ) ప్రభుత్వంవారివి (సాంఘిక సంక్షేమ శాఖ) 10 పాఠశాలలు | 0-100 |

(బి) స్థానిక సంస్థ లవి (2 పాఠశాలలు) ... 0.030

(సి) ఎయిడెడ్ వి (3 పాఠశాలలు) .... 0.020

4. 1957—58 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన ఉపాధ్యాయులు.

(ఏ) స్థానిక సంస్థలవి (4 పాఠశాలలు) 0.050

5. 1958—59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు

(ఏ) స్థానిక సంస్థలవి (4 పాఠశాలలు) 0.020

6. 1957—58 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు.

(ఎ) స్థానిక సంస్థలవి (4 పాఠశాలలు) .... 0.060

(బి) ఎయిడెడ్ వి (4 పాఠశాలలు) 0.060

7. 1958—59 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు

(ఎ) స్థానిక సంస్థలవి (4 పాఠశాలలు).... 0.020

(బి) ఎయిడెడ్ వి (4 పాఠశాలలు).... 0.020

8. 1957—58లో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

(ఎ) ప్రభుత్వంవారివి (19 పాఠశాలలు)
(సి) ఎయిడెడ్ వి (13 పాఠశాలలు) } 0.003

9. 1958—59 లో జూనియరు బేసిక్ పాఠశాల లుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

| | |
|---|---|
| (ఎ) స్థానిక సంస్థలవి (14 పాఠశాలలు) .... <br> (బి) ఎయిడెడ్‌వి (13 పాఠశాలలు) .... | 0.009 |

10 ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపుకు ... 2.050

11. 1956—57 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు తరగతులకు

(ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల, 4 సెక్షను) .... 0.030

(బి) ఎయిడెడ్‌వి (1 సెక్షనులు) .... 0.010

12. 1957—58 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు తరగతులకు

(ఎ) ప్రభుత్వం వారివి (ఒక సెక్షను, ఒక పాఠశాల) 0.090

(బి) స్థానిక సంస్థలవి (2 పాఠశాలలు 14 సెక్షనులు) .... 0.180

13. 1957—58 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ పాఠశాలలకు

(ఎ) స్థానిక సంస్థలవి. (ఒక పాఠశాల). 0.040

| | | |
|---|---|---|
| | (బి) ఎయిడెడ్‌వి (రెండు పాఠశాలలు) ... | 0.060 |
| 14. | 1958—59 లో ప్రారంభించబడిన ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలకు భవనాలు, ఆట స్థలాలు (ఒక పాఠశాల) | 0.070 |
| 15. | 1958—59 లో ప్రభుత్వ శిక్షణ పాఠశాల అలోని పదవి స్థాయి పెంచబడిన హెడ్మాష్టర్లు (ఒకరు) .... | 0.010 |
| 16. | 1956—57 లో సెకండరి గ్రేడు శిక్షణ విభాగాలుగా మార్చబడిన హైయర్ ఎలిమెంటరి గ్రేడు శిక్షణ విభాగాలకు. ... | 0.010 |
| 17. | 1958—59 లో కొన్ని ప్రభుత్వ పాఠశాలల్లో నియమించబడిన డ్రాయింగు టీచర్లకు, హిందీ టీచరకు (ఇద్దరు ఉపాధ్యాయులకు) | 0.020 |
| 18. | 1957—58 సం. లో ఇనస్పెక్టరేటులతో నియమించ బడిన గుమాస్తాలకు, టైపిస్టులకు (ఇద్దరికి) .... | 0.010 |
| 19. | 1958—59 లో నియమించ బడిన సీనియరు డిప్యూటీ ఇనస్పెక్టరులకు జవానులను కలుపుకుని (6 పదవులు) .... | 0.100 |
| 20. | 1958—59 లో బేసిక్ విద్యాపద్ధతికి మార్చబడిన ఒక శిక్షణ పాఠశాలకు .... | 0.020 |
| 21. | మూడవ ఫారం వరకు ఉచిత విద్యను గరపటానికి సంబంధించిన పథకాన్ని అమలు పరచుటకు, ఇనస్పెక్టరేటులలో నియమించ బడిన అప్పరుడివిజను గుమాస్తాలకు ( ఒక గుమాస్తా | 0.010 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 22. | విద్యావంతులలో నిరుద్యోగాన్ని నివారించడానికి పథకం .... | 1.090 |
| 23. | ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయుల నియామకం (26గురు ఉపాధ్యాయులు) | 0.120 |
| 24. | ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చడం | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (20 పాఠశాలలు) .... | 0.060 |
| | (బి) ఎయిడెడ్‌వి (7 పాఠశాలలు) ... | 0.021 |
| 25. | స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర పథకం కొరకు ఒక హైయర్ ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ పాఠశాల .... | 0.180 |
| 26. | జిల్లా బోర్డులచే ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలను స్వాధీనపరచుకోవటం .... | 1.760 |
| 27. | 1958—59'లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంటులు (ఎయిడెడ్) (2 పాఠశాలలు) .. | 0.120 |
| 28. | 1958—59 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు | |
| | (ఎ) ఎయిడెడ్‌వి (4 పాఠశాలలు) .... | 0.010 |
| | (బి) స్థానికసంస్థలవి (14 పాఠశాలలు) .... | 0.370 |
| 29. | మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులు ప్రారంభించటం (ఎయిడెడ్) 5 పాఠశాలలు కాంపెన్‌సేటరి గ్రాంటు .... | 0.050 |

| | | |
|---|---|---|
| 30. | 1958—59 లో ప్రారంభించబడిన ప్రాచ్య విద్యా పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు-ఒక ఎయిడెడ్ పాఠశాల ఎయిడెడ్ (4 సెక్షనులు) .... | 0.020 |
| 31. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను).... | 0.020 |
| 32. | ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (3 పాఠశాలలు.) .... | 0.010 |
| 33. | జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (3 జీపులు) .... | 0.160 |
| | మొత్తం | 6.152 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 1.253 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు. | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఎ) ప్రభుత్వంవారివి (2 సెక్షనులు) .... | 0 .020 |
| | (బి) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల ఒక సెక్షను) ... | 0.050 |

(సి) ఎయిడెడ్‌వి (ఒక పాఠశాల ఒక సెక్షను) .... 0.010

2 1957—58లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు

స్థానిక సంస్థలవి (3 సెక్షన్లు) .... 0.040

3. 1957—58లో హైయర్ సెకండరీ పాఠశాలల స్థాయికి మార్చబడిన ఉన్నత పాఠశాలలు.

(ఎ) స్థానిక సంస్థలవి (3 పాఠశాలలు) 0.020

(బి) ఎయిడెడ్‌వి (ఒక పాఠశాల) .... 0.020

4. ఉన్నత పాఠశాలలకు భవనాలకోసం గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలకు(3 పాఠశాలలు).... 0.050

(బి) ఎయిడెడ్ (ఒక పాఠశాల) .... 0.020

5. హైయర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు

(ఎ) స్థానిక సంస్థలవి (ఒకపాఠశాల) .... 0.050

(బి) ఎయిడెడ్‌వి (ఒక పాఠశాల) .... 0.030

6. సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలు పెంచటానికి .... 0.460

## క్రొత్త పథకాలు

7. 1958—59లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి .... 0.100

(బి) ఎయిడెడ్‌వి .... 0.005

| | | |
|---|---|---|
| 8. | మాధ్యమిక పాఠశాలలను (ప్రభుత్వంవారివి) ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచటం; సెకండరీ పాఠశాలల్లో అదనపు సెక్షనులను ప్రారంభించటం .... | 0.02 |
| 9. | ఉన్నత పాఠశాలలకు భవనాల క్రింద గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి. ... | 0.05 |
| | (బి) ఎయిడెడ్‌వి .... | 0.100 |
| 10. | ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్య పరికరాలకు గాను గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలకు .... | 0.100 |
| | (బి) ఎయిడెడ్ వాటికి .... | 0.050 |
| 11. | XI, XII తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు. .... | 0.003 |
| 12. | సిటిజన్‌షిప్ ట్రైనింగ్ (పౌరశిక్షణ) కేంద్రాలకు ... | 0.010 |
| | మొత్తం | 1.253 |

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యాభివృద్ధికిగాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 34.64 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.78 క్రింద పథకాలకుగాను ఒక జిల్లాకు కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ప్రభుత్వ కళాశాలల్లో ప్రీ-యూనివర్శిటీ కోర్సులు (1956—57 లో ప్రారంభించబడినట్టివి.) .... | 0.10 |
| 2. | ప్రభుత్వ ఆర్ట్సు మరియు శిక్షణ కళాశాలల్లో నియమించబడిన అదనపు సిబ్బందికి. .... | 0.02 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | ప్రభుత్వ కళాశాలల్లో మూడేళ్ల డిగ్రీ కోర్సును ప్రవేశ పెట్టటం. ప్రభుత్వ వారివి (ఒక కళాశాల) .... | 0.66 |
| | మొత్తం | 0.78 |

## ఇతర పథకాలు

క్రింద చూపిన విధంగా ఇతర పథకాలకోసం యీ జిల్లాలో రు. 0.53 లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ఎన్. సి. సి., ఎ. సి. సి. ల విస్తృతికి ... | 0.33 |
| 2. | అవిటి వారికో సంప్రభుత్వ ప్రత్యేక పాఠశాలలను అభివృద్ధిపరచటం. (కడపలో అంధ విద్యార్థుల కొరకు ఉన్న ప్రభుత్వ పాఠశాల) | 0.02 |

| | | |
|---|---|---|
| 3. | స్కౌటింగు, గర్ల్‌గైడింగు అభివృద్ధికి .... | 0.03 |
| | **క్రొత్త పథకాలు** | |
| 4. | పంచాయితీలకు, ప్రయివేటువారికి, సహకార సంఘాలకు, గ్రామ సంఘాలకు, స్థానిక సంస్థలకు చెందిన గ్రంథాలయాలకు గ్రాంట్లు.... | 0.04 |
| 5. | అవిటి విద్యార్థులకు స్కాలరుషిప్పులు .... | 0.02 |
| 6. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు (ఒక పాఠశాల) | 0.02 |
| 7. | హిందీ ప్రేమీమండలుల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0.01 |
| 8. | యువజన సంక్షేమ కార్యకలాపాలు .... | 0.01 |
| 9. | ఎన్. సి. సి., ఎ. సి. సి. యూనిట్లలో పనిచేసే చౌకీదార్ల జీతాల సవరింపుకు. .... | 0.01 |
| 10. | అవిటి విద్యార్థులకు ఉద్దేశించబడిన ప్రభుత్వ ప్రత్యేక పాఠశాలల్లో విద్యార్థులకిచ్చే అలవెన్సులను ప్రామాణీకరించటం (కడపలో అంధ విద్యార్థుల కోసం ఉన్న ప్రభుత్వ పాఠశాల) | 0.02 |
| 11. | అవిటి విద్యార్థుల కుద్దేశించబడిన ప్రభుత్వ ప్రత్యేక పాఠశాలల్లో అదనపు సిబ్బంది నియామకం (కడపలో అంధవిద్యార్థుల కోసం ఉన్న ప్రభుత్వ పాఠశాల) .... | 0.03 |
| | మొత్తం | 0.53 |

## ప్రొద్దుటూరులో క్రొత్త పాలిటెక్నిక్‌ను ఏర్పాటు చేయటం

రోజు రోజుకు ఎక్కువవుతున్న సూపర్‌వైజరీ సిబ్బంది అవసరాన్ని తీర్చటంకోసం కడప జిల్లాలోని ప్రొద్దుటూరులో ఏటా 120 మంది అభ్యర్థులను

చేర్చుకోవటానికి వీలుండే పాలిటెక్నిక్ నొకదాన్ని క్రొత్తగా స్థాపించటానికి ప్రతిపాదింప బడింది. ఇంజనీరింగులో మూడు విభాగాలయిన సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్ ఇంజనీరింగులలో మూడేళ్ళ పోస్టు మెట్రిక్ డిప్లొమాకోర్సులు ఈ సంస్థలో ఉంటాయి. ఈ పథకానికయ్యే ఖర్చులో రాష్ట్రప్రభుత్వ వాటాక్రింద రు. 1,50 లక్షల మొత్తం యీ సంవత్సరం ప్రణాళికలో కేటాయించబడింది. ఇంతేకాక కేంద్రప్రభుత్వ వాటాక్రింద రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది. కేటాయింపు చేయబడిన మొత్తమంతా భవనాల నిర్మాణానికి, పరికరాల కొనుగోలుకుగాను వినియోగించ బడుతుంది.

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు. యితర వైద్య సంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చటం కోసం రెండవ ప్రణాళికా కాలంలో అదనంగా 495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది., జిల్లా హెడ్ క్వార్టర్సు అసుపత్రులలోను, యితర టీచింగు అసుపత్రులలోను ఉన్న 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి యీ శిక్షణ యివ్వబడుతుంది. అదేప్రకారం 1956—57, 1958—59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ సంవత్సరంలో రు. 0.22 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.02 లక్ష కడపలో ఉన్న జిల్లా కేంద్ర అసుపత్రిలోను 9 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## జిల్లా కేంద్రాలలోని అసుపత్రుల అభివృద్ధి

రెండవ ప్రణాళికయొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 13.00 లక్షల మొత్తం ఖర్చుతో అదనంగా భవనాలు నిర్మించటంద్వారాను, పరికరాలను సిబ్బందిని మొదలయిన వాటిని సమకూర్చటంద్వారాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా ఆసుపత్రులకు అనేకమైన అభివృద్ధిపనులు చేయబడినాయి.

జిల్లా ఆసుపత్రులను అభివృద్ధి పరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 9.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష మొత్తం కడపలోని జిల్లా ఆసుపత్రికి అభివృద్ధిపనుల నిమిత్తం వినియోగించ బడుతుంది.

## తాలూకా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులకు అభివృద్ధి పనులు.

పడకల సంఖ్యను పెంచడం, అదనంగా భవనాలను నిర్మించడంద్వారా ఆంధ్రప్రాంతంలోని తాలూకా ఆసుపత్రులనుఅభివృద్ధి చేయటంకోసం రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటం మూలంగా తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, రాజంపేటలోని తాలూకా ఆసుపత్రిని ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.24 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1958—59 లో స్వాధీనం చేసికో బడినట్టి సిద్ధావటంలోని ఆసుపత్రి నిర్వహణకు పై డబ్బు వినియోగించబడుతుంది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సాకేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1957—58 లో హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదలను అరి కట్టడం అవసర మయింది. ఇందువల్ల 1957—59 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను— 10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.66లక్ష కేటాయించబడింది. ఇందులో రు.0.02 లక్ష ఈ జిల్లాలో వినియోగించబడుతుంది. జమ్మలమడుగులో ఒక కుటుంబ నియంత్రణ కేంద్రం ఏర్పాటుచేయటానికి, 1958—59 లో కడపలో ప్రారంభించబడిన కేంద్రాన్ని నిర్వహించటానికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

## సహాయక నర్సు—మంత్రసానులకు శిక్షణ

సహాయకనర్సు - మంత్రసానుల శిక్షణకోసం యింతకు ముందు ప్రారంభించిన 5 కేంద్రాలను నిర్వహించటానికి, క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ఈ సంవత్సరంలో ప్రారంభించటానికిగాను ప్రణాళికలో రు. 0.78 లక్ష కేటాయించబడింది, ఇందులో రు. 0.10 లక్ష కడపలోని హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రిలో ఏర్పాటుచేయబడిన శిక్షణ కేంద్రాన్ని కొనసాగించటం కోసం ప్రత్యేకించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకంక్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి.

ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకంక్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.50 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికి పై డబ్బు వినియోగించబడుతుంది.

## కుష్టురోగ నివారణ

1957—58, 1958—59 సంవత్సరాలలో ప్రారంభించబడిన 4 కుష్ఠు వ్యాధి నివారణ సహాయక కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 2 కేంద్రాలను ప్రారంభించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.55 లక్షల మొత్తం కేటాయించబడింది, ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాలోని అనంతరాజు పేటలో ఒక కుష్ఠు వ్యాధి నివారణ కేంద్రాన్ని ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించబడింది.

## సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకుముందు స్థాపించిన 5 కేంద్రాలను కొనసాగించడానికి, ఈ సంవత్సరం మరో 3 నెలకొల్పడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రూ. 0.20 లక్ష మొత్తం, కడపలోని హెడ్‌క్వార్టర్స్ అనుపత్రిలో 1958—59 లో స్థాపించబడిన సుఖ వ్యాధి చికిత్సా కేంద్రాన్ని కొనసాగించడానికిగాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## చెవి, ముక్కు, గొంతు చికిత్సాలయాలు

ఈ సంవత్సరం యీపథకంకోసం కేటాయించ బడిన రు. 0.30 లక్షలో రు. 0.06 లక్ష కడపలోని హెడ్‌క్వార్టర్సు అనుపత్రిలో చెవి, ముక్కు, గొంతు చికిత్సా విభాగమొకదాన్ని ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించ బడింది.

## నేత్రచికిత్సాలయాలు

1958_59లో రెండు నేత్రచికిత్సాలయాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ సంవత్సరం మూడునేత్ర చికిత్సాకేంద్రాలను ఏర్పాటు చేయటానికి ప్రస్తుత మున్నవాటిని కొనసాగించటానికి ప్రతిపాదింప బడింది.

రు. 0.06 లక్ష కడపలోని హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో ఒక నేత్ర చికిత్సాలయమన్ని ఏర్పాటు చేయటంకోసం వినియోగించ బడుతుంది.

# ప్రజారోగ్యం

## దాయీలకు శిక్షణ

గ్రామీణ ప్రాంతాలలో ఇండ్లలోనే కాన్పులు జరిగే పద్ధతిని మెరుగు-పరచడానికిగాను 1956—57 సంవత్సరంలో యీ శిక్షణ పథకం ప్రారంభించబడ్డది. నాటు మంత్రసానులు పురుళ్లు పోయడంలో ఉత్తమ పద్ధతుల నవలంబించి తమవృత్తిని నిర్వహించడానికిగాను శిక్షణ పథకం ఒకటి 1956—57 లో ప్రారంభించబడింది. రెండవ ప్రణాళికయొక్క మొదటి మూడు సంవత్సరాలలో 1,329 మంది ఈ పథకంక్రింద శిక్షణకోసం చేర్చుకోబడ్డారు. ఈ సంవత్సరంలో ఆ పథకం కొనసాగింపబడడమే కాకుండా మరొక 720 మంది అభ్యర్థులు చేర్చుకోబడతారు. అందుకోసం రు. 0.81 లక్ష మొత్తం రాజ్య ప్రణాళికలో కేటాయించబడింది. 60 మంది దాయీలకు శిక్షణ నిచ్చేటందుకు మొత్తంలో 8,800 రూపాయలు ఈ జిల్లాలో వినియోగించ బడతాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

1953—57 లో మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన 2 మలేరియా నివారణ యూనిట్లు కొనసాగింపబడినాయి. 1957—58 లో మరో 2 యూనిట్లు ఏర్పాటుచేయడం జరిగింది. ఈ 4 యూనిట్లు 1958—59 లో కొనసాగించ బడ్డాయి. ఈ వ్యాధిరాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చటానికి ఈ యూనిట్లు ఉపకరించాయి. నేషనల్ మలేరియా నివారణ కార్యక్రమం మలేరియా నిర్మూలనా కార్యక్రమంగా 1—4—1958 నుండి మార్చబడింది. అదనంగా స్ప్రేయింగు పరికరాలు, డి.డి.టి. ని సరఫరా చేయడం ద్వారా మలేరియా సోకని ప్రాంతాలతోసహా రాజ్యం అంతటా మందు చల్లడం తీవ్రం చేయబడుతుంది. 17 సబ్ యూనిట్లతో ప్రస్తుతం ఉన్న 4 యూనిట్లను కొనసాగించడానికి, 16 హైపో-ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, ప్రజారోగ్య శాఖ రీజినల్ అసిస్టెంటు డైరక్టర్ల కార్యాలయాలను మూడింటిని నెలకొల్ప

డానికి 1959—60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వం వాటాక్రింద రూ. 22.99 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 1.62 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ప్రస్తుతం ఉన్న ఒక సబ్ యూనిట్టును కొనసాగించడానికి, ఒక హైపో ఎండెమిక్ యూనిట్టును ప్రారంభించడానికి ప్రజారోగ్యశాఖ ప్రాంతీయ డైరెక్టరు కార్యాలయాన్నొకదాన్ని ఏర్పాటు చేయడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్యవిషయాలను తెలియ చెప్పేటందుకు 1957—58 లో ప్రజారోగ్య శాఖ డైరక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ స్థాపించబడింది. రెండు వ్యాన్లు కొనబడ్డాయి. ఇంతకుముందుకొన్న 11 జీపులను, అంటువ్యాధుల నివారణగురించి ప్రచారంచేయుడానికి ఉపకరించే రెండు వ్యానులను నిర్వహించడం జరిగింది. 1958—59 లో ఈ పథకాన్ని కొనసాగించడానికి న్యూఢిల్లీలోని వర్కింగు గ్రూపు సమ్మతించలేదు. అయినప్పటికి 1959—60 లో జిల్లాలలో ప్రస్తుతముంటున్న 11 జీపులను 4 వ్యానులను నిర్వహించడానికి, హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచారసంస్థను కొనసాగించడానికి, 8 క్రొత్త వ్యానులను కొనడానికిగాను 1959—60 లో రూ. 4.15లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 0.12 లక్ష యీ జిల్లాలోఉన్న ఒక జీపు, ఒకవ్యాను నిర్వహణకోసం ప్రత్యేకించబడింది.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

## పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానికసంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగుపారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102.446 లక్షల మొత్తాన్ని (రు. 82.446 లక్షల మొత్తం కేంద్రప్రణాళికక్రింద, రు. 20.00 లక్షలమొత్తం రాజ్యప్రణాళికక్రింద) ఋణ సహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41.270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 3 300 లక్షల మొత్తం క్రిందిపథకాలకుగాను యీ జిల్లాలో వినియోగించబడుతుంది.

| పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|
| ప్రొద్దుటూరు నీటి సరఫరా పథకం .... | 3.200 |

## గ్రామ ప్రాంతాలకు నీటి సరఫరా, పారిశుధ్య సౌకర్యాలకోసం జాతీయ పథకం

గ్రామీణ ప్రజలకు మంచినీటి, పారిశుద్ధ్య సౌకర్యాలను కలుగచేయడమే ఈ పథకం ఉద్దేశం. ఆంధ్ర ప్రాంతానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 16.34 లక్షల మొత్తం కేటాయించ బడింది. కార్యక్రమాన్ని త్వరితరం చేయడంకోసం 1958—59 లో కడపలో ఒక యూనిట్టు ఇందుకుగాను ఏర్పాటుచేయుబడింది. ఇందుకుగాను పై మొత్తంలో 3 30 లక్షల మొత్తం కేటాయించబడింది.

# గృహనిర్మాణం

## మురికి పేటల నిర్మూలన, పాకీవారికి గృహవసతి

అనారోగ్యకరమైన మురికి పేటలు ఏర్పడకుండా అరికట్టేందుకుగాను మురికి పేటలలో నివసించే వారి కోసం మురికిపేటల నిర్మూలన పథకాన్ని భారత ప్రభుత్వం వారు, రూపొందించారు. ఈ పథకాన్ని అమలుపరడానికి ఈ జిల్లాలో మురికిపేటల నిర్మూలనకుగాను కొంత మొత్తం కేటాయించ బడింది.

ప్రతిపథకానికి అంచనా వేయబడే ఖర్చులో నూటికి 75 వంతులు భారత ప్రభుత్వం వారు ఇస్తారు. అందులో నూటికి 50 వంతులు ఋణం క్రింద, 25 వంతులు సబ్సిడీక్రింద ఇస్తారు. రాజ్య ప్రభుత్వం మాచింగు గ్రాంటు క్రింద నూటికి 25 వంతులు భరిస్తుంది.

ఈ జిల్లాలో పాకీవారికోసం 28 ఇళ్లు నిర్మించే నిమిత్తం ప్రణాళికలో రు. 0.60 లక్ష మొత్తం (కేంద్ర ప్రభుత్వం చేసే సహాయం కలుపుకొని) కేటాయించబడింది.

## పట్టణాలలో గృహ వసతి సహకార సంఘాలు

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లను నిర్మించు కోవడానికి దీర్ఘకాలిక ఋణాల నివ్వడంద్వారా పట్టణ ప్రాంతాలలోని ఇండ్ల కొరతను తీర్చడానికి ఉద్దేశించ బడింది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 340 ఇండ్లను నిర్మించు కోవడానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రు. 20.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.20 లక్షల మొత్తం యీ జిల్లాలో 4 ఇళ్ళ నిర్మాణానికిగాను ప్రత్యేకించ బడింది.

# కార్మికులు - కార్మిక సంక్షేమం

## ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే:

1. ఏ రకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్నవిషయాన్ని ఎంప్లాయిమెంటు అధికారులు ఖచ్చితంగా నిర్ణయించడం కోసం ఇంకా ఎక్కువ వివరాలను వారికిఅంద చేయడం.

2. విద్యాభ్యాసం పూర్తి చేసిన వారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న వారికి ఉద్యోగాల విషయంలోను, ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహా నిచ్చేటందుకు సమాచారాన్ని అంద చేయడం.

3. ఉద్యోగ సాధక కేంద్ర యొక్క పరిధిలో ఉండే ప్రాంతంలో గాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింప బడే ఇతర ప్రాంతాలలో గాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చే మార్పులు గమనించడానికి పద్ధతులను రూపొందించడం.

4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగ, నిరుద్యోగాల పోకడలను ముందుగా సూచించడం.

ఈ పథకం, 1957-58లో 5 ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాల్లో అమలు పరచబడింది ఆ కేంద్రాలేవంటే హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం,

విజయవాడ, కర్నూలు. వీటి కేంద్రయూనిట్టు హైదరబాదులో ఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. 1958-59లో ఈ పథకం, కాకినాడ, గుంటూరు, నిజమాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింప చేయబడింది. 1959-60లో విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం, పైన తెలుప బడిన ఎక్స్ఛేంజిలలో అదనపు సిబ్బందిని నియమించడం, డైరెక్టరేటులోని సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి ఆజ్ఞాయిషి క్రింద ఉంచడంద్వారా సెంట్రల్ యూనిట్టును పటిష్ఠం చేయటం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలోకూడ సిబ్బందిని పెంచడానికి ఉద్దేశింప బడింది. ఈ కేంద్రాలన్నిటిలోను ఒక్కొక్క గుమస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యే ఖర్చులో కేంద్ర ప్రభుత్వం వాటు భరించే రు. 0.47 లక్షకుతోడుగా రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం రు. 0.78 లక్షలోను రు. 0.012లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమం క్రింద వినియోగించ బడుతుంది.

## వెనుకబడినతరగతులు, షెడ్యూల్డుకులాలసంక్షేమం.

### షెడ్యూల్డు కులాలు-షెడ్యూల్డు కులాల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

ఈ పథకంక్రింద హరిజన విద్యార్థులకు ఇతర అర్హమైన కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరు షిప్పులు మంజూరు చేయబడుతున్నాయి. తల్లి దండ్రుల ఆదాయం ఉన్నత పాఠశాల విద్యార్థుల విషయంలో రు. 1,500లకు, కళాశాల విద్యార్థుల విషయంలో రు. 1,800లకు మించకుండా ఉంటే రుసుం చెల్లించనవసరంలేకుండా మాఫీ చేయబడుతుంది. 1959—60 లో ఇదివరకు మంజూరుచేసిన స్కాలరుషిప్పులను కొనసాగించడమే కాకుండా సుమారు 1,600 అదనపు స్కాలరు షిప్పులను మంజూరు చేయడానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. స్కాలరు షిప్పులు ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకుకూడా ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళ్లు

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడుపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యా సంవత్సరానికి విద్యార్థికి రు. 150 చొప్పున బోర్డింగు గ్రాంట్లు వెనుకబడిన తరగతుల, హరిజనుల విద్యార్థులకు ఏటా ఇవ్వబడుతున్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయ్యడానికి రు. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడ ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు.

ఈ జిల్లాలోని కాజీపేట, రాజంపేటలలో ఉన్న హాస్టళ్ళు 1959—60 సంవత్సరంలో రు. 0.08 లక్ష వ్యయంతోని ర్వహింప బడతాయి.

## పాఠశాలల, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మతులు.

ఆంధ్ర ప్రాంతంలోని సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ ఆజ్ఞాయిషీ క్రింద గల సబ్సిడీ పొందే హాస్టళ్లు అద్దె భవనాలలో నెలకొల్పబడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు సబ్సిడీపొందే హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్టబడింది. 1959-60లో 25 పాఠశాలభవనాల నిర్మాణం కోసం రు. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో 3 భవనాలు రు. 0.09 లక్ష వ్యయంతో ఈ జిల్లాలోనిర్మించ బడతాయి.

## పారిశుధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలను ఆరోగ్యకరంగా చేయటానికి బాటలు, మరుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటుచేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959—60లో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 20 బావులు యీ జిల్లాలో రు. 0.40 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ల స్థలాల సేకరణ

ఈ పథకం క్రింద ఇళ్ల స్థలాలను సేకరించి వాటినిఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించటంకోసం దానివల్ల కలిగే అనర్థకాలను గురించి ప్రచారం చేయడానికి, వీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వటానికి, పత్రికలకు సబ్సిడీలు ఇవ్వటానికి, పోస్టర్లు, కరపత్రాలను ముద్రించటానికి, హరిజన దినోత్సవాలు వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలు పరచటంకోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్డ్ ఆఫ్ సర్వీసు రెడ్ క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు హరిజనోద్ధరణకు పాటుపడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలుకూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహనిర్మాణ పథకం

హరిజనులు ఎంత బీదవారంటే వారికి యిళ్ల స్థలాలను ఉచితంగా యిచ్చినప్పటికీ యిళ్లు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో ఉన్నారు. ఇందువల్ల హరిజనులు యిళ్లు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క యింటికి రు. 750లు ధన సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను,

రు. 500 లు ఋణంగాను ఇవ్వడం జరుగుతుంది. అయితే యీ సౌకర్యం పొందే ప్రతివ్యక్తి కొంత లేబరుని, సామాగ్రిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. వాటివిలువ పై మొత్తంలో చేరదు. హరిజనులతోకలిసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించేనిమిత్తం, నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్లు వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేకించబడుతున్నాయి. ఈ జిల్లాలో 64 యిళ్లను నిర్మించటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48లక్ష కేటాయించబడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడినతరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వటంకోసం రాజ్యప్రభుత్వంవారు ఏటా రు. 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ పాఠశాలల్లోను కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా యింకా 920 స్కాలరుషిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడినతరగతుల విద్యార్థులకుకూడ యీ స్కాలరుషిప్పులు లభ్యమవుతాయి.

### వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు సబ్సిడైజుడు హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున యీ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకుకూడ యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు మధ్యాహ్న భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహింపబడుతున్న పాఠశాలలలో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకుగాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడిననాటినుండి సాంఘిక సంక్షేమశాఖ పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయబడింది. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0.50 లక్ష ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకుకూడ యిందుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతులకు చెందిన పిల్లల తలిదండ్రులు తమ పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగచేసే స్థితిలో లేనందువల్ల యీ పిల్లలు పాఠశాలలకు హాజరు కారు. ఇందువల్లయీ పిల్లలకు పుస్తకాలు, పలకలు మొదలగునవి సరఫరా చేయటానికి, స్కాలరు షిప్పులు మంజూరుచేయడానికి, యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్త జాతులవారికోసం నిర్మించబడిన కాలనీలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను రెండు రేడియో సెట్లను నిర్వహించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని విముక్తజాతులకు చెందిన పిల్లలకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## గృహ నిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాస గృహాలను నిర్మించుకోవటానికి యీ పథకంక్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100 లు విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్లనే వారు మరమ్మతు చేసికోదలచినట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30 లు నగదు రూపంలో చెల్లించబడుతుంది.

ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 క్రొత్త యిళ్ల నిర్మాణానికి, 100 పాత యిళ్ల మరమ్మతుకుగాను రు. 0.130 లక్ష కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

ఈ జిల్లాలో రెండు క్రొత్త బావులను త్రవ్వటానికి, రెండు మరుగుదొడ్లను నిర్మించటానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.06 లక్ష కేటాయించబడింది.

## వ్యవసాయం చేసుకోవటానికి సహాయం

ఈ పథకంక్రింద విముక్తజాతులవారికి ఆర్థికంగా సహాయపడేటందుకు వారిని వ్యవసాయంలో స్థిరపరచేటందుకుగాను వారికి కాడి ఎద్దులను సరఫరా చేయటానికి, పంపుసెట్లను నెలకొల్పటానికి, పాత బావుల మొదలయినవాటికి మరమ్మతులు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాకు 3 జతల కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 900 లు కేటాయించబడినాయి.

## కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం యీ పథకంక్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు, ముడిపదార్థాల రూపంలో ప్రతివ్యక్తికి రు. 50ల వరకు యీ సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 1,750/-లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఇందుమూలంగా 35 మందికి లాభం చేకూరుతుంది.

## వైద్య సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50మంది వ్యక్తులకు "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వబడతాయి. పై వ్యక్తులు తమకు కావలసిన మందులనుకొనుక్కోవటానికి, యితరఖర్చులకుగాను ఒక్కొక్కరికి రు. 40/-లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందు

కుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 240 లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్త జాతులకుచెందిన ఆరుగురికి "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వటం కోసంయీ డబ్బు వినియోగించబడుతుంది.

# స్త్రీ సంక్షేమం

## వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలు

విద్యావంతులయికూడ నిరుద్యోగులుగానున్న తక్కువ ఆదాయం వచ్చే తరగతి కుటుంబాలకు చెందిన బాలికలకు సహాయం చేయటంకోసం 1958—59 సంవత్సరంలో యీ జిల్లాలోని కడపలో వృత్తి విద్యా శిక్షణ కేంద్రం ఒకటి ఏర్పాటుచేయబడింది. ఇందులో టైపురైటింగు, షార్టుహ్యాండు, బుక్-కీపింగు, అకౌంటెన్సీ, సెక్రటేరియల్ కోర్సులలో శిక్షణ యివ్వబడుతుంది. ఈ కేంద్రాన్ని కొనసాగించటానికి, 30 మంది అభ్యర్థులను చేర్చుకోవటానికి, అభ్యర్థులు చేరటానికివచ్చేపక్షంలో యింకా ఎక్కువమందిని చేర్చుకోవటానికి గాను 1959—60 సంవత్సరానికి రు. 0·156 లక్ష కేటాయించ బడింది.

## ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమ శాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యక్రమాలను తీవ్రతరం చేయటానికి, అవి మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ పరికరాలు, సౌండు ప్రొజెక్టర్లు, విద్యా బోధన పటాలు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు, కుట్టు మిషనులు మొదలయినటువంటి పరికరాలను, ఇతర ముఖ్య సామగ్రిని ఆంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీసంక్షేమశాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరాచేయటానికి ప్రతిపాదించబడింది. ఇందులో రు, 900 లు యీ జిల్లాకు కేటాయించబడినాయి.

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ప్రస్తుతమున్న 2 సంక్షేమ విస్తరణ కేంద్రాలను నిర్వహించటానికి, ఈ జిల్లాలో మొదటిదశ బ్లాకుల్లో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్

పద్ధతిని మరొక ప్రాజెక్టు ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వవాటా క్రింద ప్రణాళికలో ఈ సంవత్సరం రు. 0.386 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ ప్రారంభించబోయే ప్రాజెక్టుకు అయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు, రాజ్యప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుంచి సేకరించే మాచింగు విరాళాలు కూడ ఇందుకు తోడవుతాయి.

### సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం ఒక ప్రభుత్వ సదనాన్ని, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 పురుషులకు, 11 స్త్రీలకు) ప్రారంభించడానికి ఆయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వంవాటాక్రింద 1959-60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.141 లక్ష యీజిల్లాకు ప్రత్యేకించబడింది. కడపలో పురుషులకుగాను ఒకజిల్లాఆశ్రయ కేంద్రం నెలకొల్పుటకు పైడబ్బు వినియోగించ బడుతుంది.

## మునిసిపలు రోడ్లు అభివృద్ధి పనులు

మున్సిపాలిటీల, రెండుపట్టణ పంచాయతీలయొక్క ఆదాయమార్గాలను అభివృద్ధిపరచే ఉద్దేశంతోను స్థానిక ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలగజేసే ఉద్దేశంతోను రెండవ ప్రణాళికలో రు. 47.54 లక్షలమొత్తం కేటాయించ బడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం కలుగజేయడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది. ఇందులో రు. 21.42 లక్షలు మొదటి మూడుసంవత్సరాలలో ఖర్చుచేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 11.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.15 లక్ష మొత్తం 1958—59లో టౌను ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించ బడుతుంది. మిగిలిన రు. 11.44లక్షలలోను, రు. 0.25 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఋణం మొత్తం, స్థానికసంస్థ పేరు, పని వివరం ఈ దిగువ తెలుపబడ్డాయి.

| స్థానికసంస్థపేరు | పని వివరము | అప్పు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| కడప పురపాలకసంఘం | బళ్ళు, బస్సు స్టాండు లకు అభివృద్ధిపనులు | 0.25 |
| | మొత్తం | 0.25 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియోసెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 410 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో 232 సెట్లుమాత్రం 1956—59 సంవత్సరాల కాలంలో యీ జిల్లాలో నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 86 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్ప టానికి, 1-4-1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లనూ నిర్వహించ డానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.318 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణసహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలనుగురించి ప్రచారంచేయటం కోసం 1956—57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించ టానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించ

బడింది. ఇందులో రు. 43,517 లు యీ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించ బడతాయి.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంట్లు, యితర సిబ్బందికి జీతాలు .... | 5,987 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, యితర ఖర్చులకు... ... | 1,200 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు ... | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటుచేయడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళికా వారోత్సవాలు ఏర్పాటు చేయటానికి ... | 900 |
| 6. | జిల్లాలో పనిచేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు. .... | 1,520 |
| 7. | సంచార వ్యానును సమకూర్చుటకు ... | 32,800 |
| | మొత్తం | 43,157 |

## అర్థగణాంకశాఖ

1959—60 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజనుగుమాస్తా, ఇద్దరు జవానులు యిందులో నియమించబడతారు. జిల్లాస్థాయిలో రాజ్యంయొక్క గణాంక సేకరణ కార్యక్రమాలను సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్టుచేయటానికి "లయజన్ ఏజెన్సీ"గా

జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.10 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

## తంతి, తపాలా సౌకర్యాలు

1959—60లో 30 తపాలా కార్యాలయాలను ప్రారంభించటానికి ప్రతిపాదింప బడింది. ఇంతేకాక ప్రొద్దుటూరు బజారు పోస్టుఆఫీసులోను, కాజిపేట, నాగిరెడ్డిపల్లెలలోను 3 టెలిగ్రాఫ్ (కంబైండు) ఆఫీసులను ప్రారంభించటానికి ప్రతిపాదింప బడింది. సిద్ధవటం, బద్వేలు, కొండాపురం, పులివెందులల్లో మూడు పబ్లిక్ కాల్ ఆఫీసులను ఏర్పాటుచేయటానికికూడ ప్రతిపాదింప బడింది.

## రైలు మార్గాలు

విశాఖపట్టణం జిల్లా లో రైలుమార్గాలకు సంబంధించి 1959—60 లో క్రింది కార్యక్రమం అమలు జరుప బడుతుంది.

| | | |
|---|---|---|
| 1. | నందలూరులో నీటిసఫరా అభివృద్ధి పనులు. ... | 75 |
| 2. | నందలూరులోని "లోకోషెడ్డు" కు అభివృద్ధి పనులు. ... | 262 |
| 3. | నందలూరు విద్యుతీకరణ | 210 |

## కడప జిల్లా ప్రణాళిక అభివృద్ధి సంఘం సభ్యుల జాబితా

1. కలెక్టరు, కడప — అధ్యక్షుడు
2. జిల్లా ప్లానింగు ఆఫీసరు, కడప
3. జిల్లా పశువైద్యశాఖాధికారి, కడప

4. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, కడప
5. జిల్లా అటవీ శాఖాధికారి (ఉత్తరం), కడప
6. జిల్లా అటవీ శాఖాధికారి (దక్షిణం), కడప
7. జిల్లా వైద్యశాఖాధికారి, కడప
8. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, కడప
9. జిల్లా విద్యాశాఖాధికారి, కడప
10. జిల్లా పంచాయతీ ఆఫీసరు
11. జిల్లా పశువసాయ శాఖాధికారి, కడప
12. జిల్లా సంక్షేమ శాఖాధికారి, కడప
13. జిల్లా సహకార సంఘాలడిప్యూటీ రిజిస్ట్రారు (ఉత్తరం), కడప
14. జిల్లా సహకార సంఘాలడిప్యూటీ రిజిస్ట్రారు (దక్షిణం), కడప
15. వ్యవసాయశాఖ డిప్యూటీడైరెక్టరు, కడప
16. రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు, కడప
17. అసిస్టెంటు కలెక్టరు, రాజంపేట
18. రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు, జమ్మలమడుగు
19. డివిజనల్ ఇంజనీరు, (రహదార్లు), కడప
20. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి, కడప
21. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (కన్‌స్ట్రక్షన్) కడప
22. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి, కడప
23. అసిస్టెంటు ఇంజనీరు, ప్లానింగు, కడప
24. అసిస్టెంటు రేడియో ఇంజనీరు. కడప
25. పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, కడప
26. అసిస్టెంటు ఉమన్ వెల్‌ఫేర్ ఆఫీసరు, కడప

27. కడపజిల్లా బోర్డుస్పెషల్ అఫీసరుయొక్క పర్సనల్ అసిస్టెంటు

28. కడపజిల్లా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు స్పెషల్ఆఫీసరు

29. మైనర్ ఇరిగేషన్ సూపరువైజరు (జనరల్) కడప

30. మైనర్ ఇరిగేషన్ సూపరువైజర్ (చిన్నచెరువులుపనికి) కడప

31. మైనర్ ఇరిగేషన్ సూపరువైజరు (స్పెషల్ i ) కడప

32. మైనర్ ఇరిగేషన్ సూపరువైజరు( స్పెషల్ ii ) కడప

33. సూపరింటెండెంటు, ఫ్రూట్ రీసెర్చి స్టేషన్. కోడూరు

34. ఫీల్డుఆఫీసరు. ఫయివ్ యియర్ ప్లాన్ పబ్లిసిటీ, కడప

35. ఫిషరీస్ అసిస్టెంటుడైరెక్టరు, అనంతపురం

36. బ్లాక్ డెవలప్మెంటు ఆఫీసరు, కడప

37. ,, జమ్మలమడుగు

38. ,, ముద్దనూరు

39. ,, రాయచోటి

40. ,, మైదుకూరు

41. ,, లక్కిరెడ్డిపల్లి

42. ,, బద్వేలు

43. ,, పోరుమామిళ్ళ

44. ,, కోడూరు

45. ,, కమలాపురం

46. ,, పులివెందుల

47. ,, సిద్దవటం

48. ,, వేంపలి

49. రీజినల్ ఇన్స్పెక్టర్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్, కడప

## అనధికార సభ్యులు

50. శ్రీ వి. రామిరెడ్డి, ఎం.పి., కడప

51. శ్రీ టి. ఎన్. విశ్వనాథరెడ్డి, ఎం.పి., మదనపల్లి

52. శ్రీమతి యశోదరెడ్డి, ఎం.పి., 3-6-76 హిమయత్‌నగరు, హైదరాబాదు

53. శ్రీమతి కె. రాయసుబ్బమ్మ, ఎం.ఎల్.సి., కడప

54. శ్రీ డి. నారాయణరెడ్డి, ఎం.ఎల్.సి., కడప

55. శ్రీ వై. ఈశ్వరరెడ్డి, ఎం.ఎల్.సి., కడప

56. శ్రీ ఆర్. సీతారామయ్య, ఎం.ఎల్.సి., పెనికలపాడు

57. శ్రీ రాజువెంకట సుబ్బారెడ్డి, ఎం.ఎల్.సి., కో-ఆపరేటివ్ కాలని, కడప

58. శ్రీ బి. ఎన్. రెడ్డి, ఎం.ఎల్.సి., c/o డైరెక్టర్, వాహిని ప్రొడక్షన్స్, మద్రాసు

59. శ్రీ కె. కోటిరెడ్డి, ఎం.ఎల్.ఎ., కడప

60. శ్రీ మహమ్మద్ రహ్మతుల్లా, ఎం.ఎల్.ఎ., కడప

61. శ్రీ పి. వెంకటసుబ్బయ్య, ఎం.ఎల్.ఎ., కడప

62. శ్రీ పి. బసిరెడ్డి, ఎం.ఎల్.ఎ., కడప

63. శ్రీ బి. రత్నసభాపతి, ఎం ఎల్.ఎ., ఎల్లంపేట

64. శ్రీ కె. రామయ్య, ఎం.ఎల్.ఎ., జమ్మలమడుగు

65. శ్రీ వై. ఆదినారాయణరెడ్డి, ఎం ఎల్.ఎ., సుండుపల్లి

66. శ్రీ పి. పార్థసారథి, ఏం.ఎల్.ఎ., కడప

67. శ్రీ బి. రాంరెడ్డి, ఎం.ఎల్.ఎ., బద్వేలు

68. శ్రీ ఎన్. సాంబిరెడ్డి, ఎం.ఎల్ ఎ., కమలాపురం

69. శ్రీ ఆర్. సి. ఓబులరెడ్డి, ఎం.ఎల్.ఎ., ప్రొద్దుటూరు

70. శ్రీ ఎం. దిబ్బారెడ్డి, ఎస్. ఉప్పాలపాడు, జమ్మలమడుగు తాలూకా
71. శ్రీ సి. ఎం. రామచెంద్రారెడ్డి, ముద్దనూరు
72. శ్రీ బి. కె. సుబ్బారెడ్డి, మైదుకూరు
73. శ్రీ డి. ఎల్. వెంకటస్వామిరెడ్డి. ఖాజీపేట, సుంకేసుల
74. శ్రీ పి. బాలిరెడ్డి, పంచాయతిసమితి అధ్యక్షుడు, పోరుమళ్ళ
75. శ్రీ పి. ఎల్లమునిరెడ్డి, పురపాలక సంఘాధ్యక్షుడు, ప్రొద్దుటూరు
76. శ్రీ ఆర్ జోశిరెడ్డి, చేపాడు
77. శ్రీ ఎస్. నాగిరెడ్డి, వేంపల్లి
78. శ్రీ వై. పెంచలయ్య, కడప
79. శ్రీ పి. రమణారెడ్డి, కడప
80. శ్రీ ఆర్. గోవిందరావు, కోడూరు
81. శ్రీ టి. చంద్రశేఖరరెడ్డి, రాయచోటి
82. శ్రీ జయరామిరెడ్డి, రేగుడిపల్లి
83. శ్రీ రాజుసుబ్బారెడ్డి, రాచినాయపల్లి
84. శ్రీమతి రాజంకృష్ణస్వామి, కడప
85. శ్రీ ఆర్. మునిరెడ్డి, వెలివల్లి
86. శ్రీమతి రాజ్యలక్ష్మి నాగరాజన్, కడప
87. శ్రీ నాగిరెడ్డి సుబ్బారెడ్డి, సిద్ధౌట్
88. శ్రీ ఎం. నరసరామయ్య, కోడూరు
89. శ్రీ ఎం. వీరారెడ్డి, మాచనూరు
90. శ్రీ ఎన్. పుల్లారెడ్డి, కమలాపురం
91. శ్రీ ఎస్. రామయ్య, కొండమూల, రాయచోటితాలూక
92. శ్రీ పి. వి. పట్టాభిరామిరెడ్డి, అనంతరాజుపేట
93. శ్రీ ఆర్. చెన్నారెడ్డి, తంగేడుపల్లి, బద్వేలుతాలూక

